కొండవీడు గ్రంథమాల.—ప్రథమకుసుమము.

# నలజారమ్మ యగ్నిప్రవేశము.

---

గ్రంథకర్త

దువ్వూరు - రామరెడ్డి.



మదరాసు

ఇండియా ప్రింటింగ్ వర్క్సు, ముద్రాక్షరశాలయందు ముద్రితము.

1917



[PRICE AS. 4.

# విజ్ఞాపనము.



ఆంధ్రపాఠక మహాశయులారా!

ఇందలి ఇతి వృత్తము కల్పితముగాదు. ఇప్పటికి దాదాపు రెండువందల సంవత్సరములకుఁ బూర్వము నెల్లూరు మండలమునందున్న గూడూరునందు ఈ చరిత్ర జరిగినట్లచ్చటి వృద్ధజనులచేఁ జెప్పఁబడుచున్నది. ఇందులకు సాక్షి భూతముగా నలజారమ్మ జ్ఞాపకార్థమై గూడూరునందొక దేవాలయము నిర్మింపఁబడియున్నది. ఈ కావ్యమందు నలజారమ్మ పాతివ్రత్యము, చిత్త స్థైర్యమున్ను, పెంచలరెడ్డి న్యాయైకపరతయు, వెంకటరెడ్డి యకృత్రిమమున్ను తెలియఁబడుచున్నది. నేనీ గ్రంథమును రచియించి కొంతకాలమైనను, ప్రకటనార్హమగునా యను సందేహముచే నింతవఱకు ముద్రింపనైతి.

కాని, బ్రహ్మశ్రీ దుర్భా - సుబ్రహ్మణ్యశర్మగారు, మ-రా-రా-శ్రీ కె. కోటిరెడ్డి, బి.యె.- యల్.యల్.బి.- బి.సి.యల్.గారు, మ-రా-రా-శ్రీ పి. హెచ్. రామరెడ్డి, యం.యె.- బి.యస్.సి.- గారు, మ-రా-రా-శ్రీ మన్నెం శేషాద్రిరెడ్డి,

యల్.యం. & యస్. గారు, మ-రా-రా-శ్రీ కాటంరెడ్డి ఆది నారాయణరెడ్డిగారు మున్నగు ప్రముఖు లీ గ్రంథమును బరికించి ప్రకటనార్హ్యమని ప్రోత్సాహ మొనరించిన తదుపరినే నీగ్రంథ మును ముద్రింప సాహసించితిని. పండితులు నాబాల్యసాహస మును మన్నింతురుగాక !

నేను చదువఁగావిని యీ గ్రంథంబునఁ గొన్ని సవరణలు సూచించిన బ్రహ్మశ్రీ దుర్భా - సుబ్రహ్మణ్యశర్మగారికిఁ గృత జ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాఁడ.

గూడూరు
25-7-1917

యిట్లు,
సుజనవిధేయుఁడు,
దు - రామ రెడ్డి.

---

# అంకితము.

సీ. ఏ బాల లేనగ వెలమిహృత్కుముదంబు
వికసింపఁజేయు చంద్రికలగుంపు ;
ఏకందువదనేందు వింపార నాకన్ను
వెన్నెలపులుగులు గన్నవిందు ;
ఏకొమ్మమవ్వంపు టీక్షణంబులు మేన
వర్షించునమృతంపు వానజాలు ;
ఏపాపమురిపెంపుఁ దీపుక్రొంబలుకులు
వీనుల కవ్యక్తమైనముదము ;
తే-గీ. అట్టిలావణ్యసీమ పుణ్యప్రకామ
చిన్నిప్రాయంబున న్దివిఁజేరినట్టి
రుక్మసమదేహ చిన్నారిరుక్మిణమ్మ
నాదుచెల్లెలిస్మరియింతు నాదరమున.

చ. జలదమునందుఁ గ్రొమ్మెఱుగుచాడ్పునఁ గన్నులఁగట్టియంతలో
జెలియల ! పోయితో ప్రకృతి జీవనమెంతయుదుష్టమంచు; నీ
కలికిమొగంబు నేఁటికిని గన్నులఁగట్టు, ననూనభావనా
విలసితమూర్తివై ; ప్రణయవేగము కాలము లెక్కసేయునే?

క. నినుదలపోసినయంతనె
కనుగొనలను దుఃఖబాష్పకణములుజాఱున్ ;
మన ప్రణయ లతలఁగాలం
బను ఖడ్గముగోయఁజాలదనుజాత ! వెసన్.

చ. ఇరువదివత్సరంబులకై యేమని తెల్పుదుఁ జెల్లెలా! వ్యథా
భరమునఁ గ్రుంగెఁ జిత్తము; ప్రభాతమనోహరమయ్యు లోకము
త్కటతిమిరావిలంబగు విధంబునఁ దోఁచు; మహింజరించు నే
కరమున సహ్యమయ్యెఁ; జనఁ గాఁదడ వేలొకొ స్వర్గభూమికిన్.

తే.గీ. ప్రణయసూత్రంపు టురులలోఁ బదిలపఱచి
చేదికోనన్ను దివిసేర శీఘ్రగతిని
చెల్లెలా! యేమిసెప్పుదుఁ జిత్తమిప్పుడు
చెప్పరానట్టిశూన్యతఁ జెందెనేమొ.

తే.గీ. కష్టసుఖవార్ధికల్లోల కాండములను
ముందు వెనుకలు దెలియక మునుగ నేను
నంబరాపగాసికతాస్థలంబులందు
నాదరమ్మునిపిలిచె దోయమ్మ! నీవు.

తే.గీ. విమలసంధ్యామనోజ్ఞ పశ్చిమదిశాంబు
జాక్షిగర్భంబునందు, గాఢాంధకార
సంతతులువుట్టె చెల్లెలా! చతురసృష్టి!
చిత్రశల్యంబయిజ్జగ జ్జీవనంబు.

ఉ. మంజులనందనాంతర సమంచితకల్ప లతాకుడుంగమం
దంజికలేకరత్నరచితాయతవేదిక విశ్రమించి, గం
గంజరియించుచల్లనగు గాడ్పులసోక ముదంబునొందుచున్
సంజమనోజ్ఞదీధితుల సఖ్యమునెంచెదు రుక్మిణమ్మ! బా
ష్పాంజలితోడ నీకుఁ గృతినంకితమిచ్చితిఁ గొమ్ము ప్రేముడిన్.

ఇట్లు, నీప్రియసోదరుఁడు,

దువ్వూరు - రామరెడ్డి.

శ్రీ

# నలజారమ్మ యగ్నిప్రవేశము

ఉ. శ్రీలలితామృతేక్షణ వశీకృతుఁడాయెను గృష్ణుఁడంచు రా
ధాలలితాంగి యల్కమెయిఁదల్పమునంబవళింప "నింత కాం
తాళమప్రేయసీ!" యనుచుఁ దన్వికపోలము పుల్కరింపగా
హాళిని ముద్దులాడెను మురాంతకుఁడో ముతభక్తలోకముల్.

ఉ. చెక్కులదానధారలకుఁ జిత్తమురంజిలఁదేఁటి కూటువల్
ద్రొక్కిడిగాఁగ మూగనెటుఁదోచక పందిరి నల్లియున్న సొం
పెక్కిన చంపకస్తబక మేత్తెఱఁ ద్రుంచిమిళింద బృందముం
గ్రక్కునఁదోలు విఘ్నపతి కావ్యవిఘాతల తాలవిత్రుఁడౌ.

చ. సరసిజసంభవాస్య నవసారససారమరందపాన త
త్పరతముదంబు నొందకయ తద్దయుఁబండితచిత్త నీరజో
త్కర మకరంద పానవశతంగడు సొక్కుచునల్వరాణి నా
దు, రసనఁగొల్వుదీరి రసతుందిలకావ్యము పల్కఁగావుతన్.

ఉ. బాలుఁడనయ్యు నీకృపకుఁ బాత్రుఁడనంచుదలంచి పూర్వమేఁ
జాలకృతుల్ రచించితిని సారససంభవురాణి! వాణి! మ
ద్బాలదశా విశేషములు వ్రాయకమున్న రచింతుఁగాఁపు స
చ్ఛీల పవిత్రచారితము, చిందగఁగమ్మని పూవుఁదేనియల్.

ఉ. సారకవిత్వసంఘటన చాతురిగల్గుట పూర్వజన్మ సం
స్కారమటంచుఁబల్కుదురు సత్కవివర్యు; లదెట్టులున్న
నిష్కారణ వత్సలత్వమున సంతతమున్నను బ్రోచినట్టి త్వ
త్కారుణి కత్వముందలఁతుఁ దామరసోద్భవచిత్త హారిణీ!

చ. అనిశముఁ బుష్పితద్రుమమునందు వసించియుఁ జీడపుర్వు త
ద్ఘనకుసు మాసవంబునకుఁగా మతిసేయునె? పండుటాకు లం
దిని మనుఁగాక; షట్పదము తియ్యని తేనెలు గ్రోలిమోదముం
గను; నిటులేగదా తెలియఁగాకవి సత్కవి తారతమ్యముల్.

## కథా ప్రారంభము.

క. శ్రీసింహపురీ మండల
కాసార మరాళమనఁగఁ గాంతిల్లి రమా
వాసంబయి సతతంబునను
వాసి న్గూడూరు మిగుల వర్ధిలుచుండున్.

చ. ఖలులను సంస్కరింపఁ దమకమ్మున శిష్టుల రక్షసేయఁగా,
నిలహరి విగ్రహంబయి రహింపగ, నంత వికుంఠవిష్ట పం
బలరగ దేవతాయ తనమయ్యెను నానుతికెక్కు, నప్పురిం
గల ప్రతిదేవమందిరము కందసమాశ్రిత గోపురంబుగన్.

చ. నెలకొని భూసురోత్తములు నీరజ షండపరాగ పూగ సం
కలిత జలప్రపూర్ణమయి గ్రాలు జలాశయమందు వేకువన్
సలిలములాడి వేదవిధి సక్కగఁదీర్చి విధాతలోయనం
జెలువుగ వేదశాస్త్రములు సెప్పుచునుందురు శిష్యకోటికిన్.

ఆ-వె. జానపదులుగోరు చక్కెఱబెల్లంబు
నుప్పుమిరపకాయ పప్పులాది
వస్తుని కరమమ్మి వైశ్యుల ప్రోలను
నర్థనిధులఁగూర్చి యలరుచుండ్రు.

సీ. కుక్కుట జాలంబు కొక్కొ-రోయని కూయ
నీల్గుచు మూల్గుచు నిసుర లేచి,
యతివల కౌఁగిళ్ల నల్లన సడలించి
తల్పంబుల౯డిగి తడవికొనుచుఁ
బడకటిండ్లను వీడి తమపుఁబాతయుఁజేతి
కఱ్ఱయుఁగైకొని కదురయమునఁ
బైరుపచ్చలుచూడఁ బసులను గాపాడ
మడవలుగట్టంగ మడులుదున్న

తే-గీ. నెండవానల నాకయుద్దండలీలఁ
బ్రొద్దుపొడిచిన దాదిగాఁ బ్రొద్దుగ్రుంకు
వఱకుఁ బొలములఁ గష్టించి వచ్చుచుందు
రప్పరంబున యువకులౌ హాలికవరులు.

ఉ. పైరులుపంటలుంగలిగి పంటవలంతికిఁ బచ్చఱాల బం
గారపుఁ గొప్పు బిల్లలనఁగాఁ జెలువొప్పును నప్పరంపుము
క్కారులు పండుచేలు, మునుగాఁపులొసంగిన యప్పుదీర్పన
ద్ధారణి ధాన్యరాసులను దాఁచినగాదుల నాగమీఱుచు౯.

ఉ. ప్రోలికిదక్షిణంపుదిశఁ బుష్కరపుష్కలమై, ప్రకంపనాం
దోళిత వీచికానికర తుందిలమై, కలహంసచక్ర మీ

నాలయమై, విశుద్ధసలిలాశయమై, తనరుందటాకము
త్తాల తటావృతంబునయి తగ్గక నీరు నిదాఘకాలమే:

సీ. చెఱకుగానుగలను జిందిన రసబిందు
లాన నీగలుజుమ్ము రంచుమూగఁ;
జెఱకుపిప్పినిమేసి చెలువాఱు నెలపెయ్య
దాటులు బీళ్లకుఁ దరలుచుండ;
నెదురుమోసులు తుంగ కుదురులు తెగమెక్కి
యూరపందులబారు నేఁగిదిరుగ;
గళమునందున వ్రేలు గంటలు మ్రోయంగ
మేకమందలుపచ్చ మేతకేఁగ

తే-గీ. బనికిఁగొఱగాని సోమరి పడుచువాండ్రు
దిరుగుచుండగ బాజారు తెరువులందుఁ,
బల్లెటూరి మిటారులు పణ్యవీథి
జేరమాడఁగ నవ్వీడు దోరమలరు;

క. ఆపుర మందునఁ గాఁపుల
కాఁపురములు పెక్కుగలవు కంజాలయకుం
గాఁపురములు, నళిఘులకుఁ
దాపురమైనట్టియన్ను దానపుటిక్కల్.

వ. అప్పోటికాఁపు మేటులందు. [లై

చ. కొలిచిన మూరకెక్కుడగు గొప్పయురంబును, మాంసలంబు
మెలికలుగొన్న బాహువులు, మిట్టనొసల్, రుదురాకవన్నె చె
న్నొలసెడు మేనినిగ్గుగల యొక్కఁడు వెంకటరెడ్డినాఁగఁ బే
ర్వొలసెను గష్టజీవియయి పెద్దలనాఁటి ధనంబులొప్పగఁ;

తే-గీ. వాయురోగంబునందాను బాల్యమందు
వనర, నతనికి జనయిత్రి పసపుచేత
నుదుటఁ గాల్చిన మచ్చసొంపొదవుచుండు
నిటలలోచను మూడవ నేత్రమనఁగ.

సీ. చెరువునీటనుమున్గఁ జేవురించెనెగాని
పెన్నేరి విప్పిన వెన్నుదాటు;
స్ఫోటకచిహ్నాలు వాటిల్లెనేగాని
మొలక నవ్వులుగుల్కు ముద్దుమోము;
కావడిమోఁతలఁ గాయగాచెనెగాని
భుజపాళియుబ్బ సొంపులుఘటించుఁ;
జదువురాకుండుటఁ గొదుకుమాటలెకాని
చతురత సుంతైన సంపహోదు;

ఆ-వె. మడవకట్టుగాండ్ర మడవవ్యాజ్యములలోఁ
దనదె పెద్దగొంతు దనరుచుండు;
సేద్యమందువళవు సెప్పఁజాలినమేటి;
పట్టువిడుపుదెలియు దిట్టయతఁడు.

మ. పెరుమారెడ్డి సువంశమందుఁగలిగెం బెంపారనొక్కర్తయుర్
సిరివారాన్నిధి నుద్భవించినటులన్ శృంగారపుస్ధివియో,
సరసంబౌనవనీత విగ్రహమొనా జానొప్పునక్కన్యకన్
హరువొప్పారఁగఁ బెండ్లియాడె హాలికుండానంద నిర్మగ్నుఁడై.

క. నలజారమ్మ యనంగను
సలలితమౌపేరుగల్గి సారసముఖి, కాఁ

పులపూఁబోణులఁదానొక
తలమానికమటులఁ దనరెఁ దలమాపొగడన్.

ఆ-వె. నిమ్మపండువంటి నెమ్మేని జిగితోడఁ
గురులనీలి పసలుగునిసి యాడ,
గంగ యమునసీరు గలిసిపారినరీతిఁ
జెలియసోయగంబు చెలువుమీఱె;

తే-గీ. కన్నుఁదమ్ములు పెద్దవేగాని, కొనల
బచ్చవాడిచిన సోగలు పరిఢవిల్ల
గాంచువారికి మఱియింతగాఁగ, జిగులఁ
గ్రుమ్మరించుచుఁ గందోయి కులుకులెసఁగు.

క. సందిటఁ బచ్చలబాజీ
బందులపస నెసఁగుచుండుఁ బచ్చవొడుపుఁబూ
వుందీవల యందములా
కుందరదన బాహులతలకుం దొడవులన్.

తే-గీ. పూవుఁగొమ్మల నెలదేంట్లు మూగిజుమ్మ
జుమ్మరంచని రవళించు జోకదోఁపఁ
గాంతమణి బంధయుగమునఁ గాంతిగొల్పు
జిలుగునీలాల గాజులు నులివుఁగొలయు.

తే-గీ. నల్లఁబూసల పేరులోనాణెమైన
గిన్నెబొట్టు, కడానివంకీలు, మట్టె,
లంచుకమ్మలు, ముక్కఱ యందమెసఁగుఁ
గలికినెమ్మేని నిగ్గులచెలిమికలిమి ;

ఆ-వె. దైవభక్తిగల్గి దైవాఱునాసతి,
పతియెదైవ మంచుఁ బ్రణుతిసల్పుఁ,
దొలసి పూజసేయు దురితకార్యంబుల
జిత్తమందుఁ జింతసేయదెపుడు.

ఉ. ఇంటికినమ్మ భిక్షమని యెవ్వరువచ్చినఁ బొమ్మపొమ్మ నీ
వంటిరుచాలమందియని వాదులుసల్పక వడ్లొ, బియ్యమో
వంటకమోతగుంగొలఁది వచ్చినయర్థులకిచ్చిపంపువా
ల్గంటి ప్రమోదచిత్తయయి కల్గినదిద్దియె యంచుఁజెప్పచుర్.

చ. ఇరుగు పొరుంగువారి తగువెయ్యది యేమనితీర్పనేగదా
పరమపతివ్రతామణి, ప్రభాతమునందున గేహకృత్యముల్
సరగునఁదీర్చి రాట్నమును సట్టని త్రిప్పచు వడ్కుచుండు, సుం
దరబిసనాళ తంతువులనందగు సన్నని నూలుపోగులర్.

చ. పరపురుషాస్యముంగనినఁ బద్మవిలోచన మోమువాంచు;
దొం, దర పని లేకయున్న నిలుఁదావినాడదు; పోదుమాటికిం
బరగృహపణ్య వీథులకు; బంధులఁజూచినఁ దల్లిదండ్రు లం
గర మనురక్తి గాంచినటుగా మరియాదలుసల్పుఁ బ్రీతిగర్.

క. పతిచిత్తవృత్తి గనుఁగొని
సతతము నతఁడాజ్ఞయిచ్చు చాడ్పున వ్యతిరే
కతలేక కార్యముల నా
సతి సేయుచునుండు భక్తి శ్రద్ధలతోడర్.

క. ఈరీతిఁ గొంతకాలము
సైరికమిథునంబు ముదము సంధిల్లగ, సం

సారము సేయుచునుండెను
దూరీకృత దురితముగ, నధోక్షజుభక్తిఁ.

చ. వాలమునఁ కేఁగియున్న పతి భోజనకార్యము దీర్పరాక యు
న్న, లలితబాహ, రాట్నముఘనంబుగఁ ద్రిప్పుచుఁ జూరునం
దుఁగి, ల్కిలమనిపల్కు పిచ్చుకల క్రీడలు సూచుచునుండ
నంతలో

వెలుపలనుండి పిల్లలకు వేగమ మేతలుదెచ్చె తల్లియుఁ.

ఉ. తల్లినిజూచి పిల్లలు ముదంబునఁ గంధరముల్ నిగుడ్చి సొం
పుల్ల సిలంగఁజంచువుల నొండొరు మీఱఁగఁజాపి యేపునం
గిల్లని తల్లి యున్న దెసఁ గ్రిక్కిఱియం, గలవింక మంత న
ల్లల్లన మేతవెట్టనది యంతయుఁగాంచుచునుండెఁగాంతయుఁ.

వ. అంతరంగంబున వింతవోడమ నయ్యాలికుంతల నీగతిఁ
జింతించు.

శా. ఔరా! సృష్టివిచిత్రమెన్నఁదరమా? యంభోజగర్భుండు సొం
పారం, బిట్టకునైన నిట్టివల పత్యంతంబుఁ గల్పించి సం
సారాంభోధితరంగడోలికల నూచంగల్గె నీ లోకముఁ ;
ఈరీతిఁ విధిసేయకున్న నగునే యెందైన సంసారముల్.

ఉ. ఱెక్కలు వచ్చినంతనెతఱింగని పాడఱ వీడినీడ, మే
దిక్కున నేకుజంబులనో తేకువ గూండ్లు రచించి తల్లియుఁ
మక్కువ లేకయుండు కసుమాలపుఁ బిల్లలమీఁదఁ బక్షికి
మక్కువయున్నదే! యిఁకను మానవులన్వలపుంట దొడ్డయే?

ఉ. పిట్టలకైనగాని యిటుపిల్లలఁజూచిన యంతనుల్లమం
దెట్టులనుండునో ప్రణయమెవ్వరికైనను జెప్పశక్యమే ?

కట్టిడిగాఁడె బ్రహ్మ యిటు కౌతుకయుక్తిలఁ జేసి పత్తులన్
దిట్టతనాననన్ను గడుదీనత సృక్కఁగఁ జేసెనక్కటా !

చ. మునుబుడ బుక్కి వానికిని మోదమునన్ జరిచీరయీయనా
కనువుగ వెండితాయెతున యంత్రము సంఘటియించియిచ్చెనా
యనఘుడ; దేమొకాని యటులైననునొక్కయపత్యమింతకుం
బనపు లెకానికల్గదుగ ! ప్రాగ్భవదుష్కృత మెంతగాఢమో ?

ఉ. నా సరివారిజాక్షులు మనంబున సంతసముప్పతిల్ల వి
శ్వాసము నందనూజులను జక్కిలిగింతలు పెట్టిపాద వి
న్యాసవిలాసముంగనుచు నాననచుంబన మాచరించుచున్
వాసరముల్ తమింగడుపనాకిటు వంజతనంబు చెల్లునే ?

శా. పూర్వం బెట్టియఘంబుసల్పితినో ? యేపుణ్యాత్మసంఘంబులన్
గర్వాంధంబునఁ గష్ట పెట్టితినో ? యేకళ్యాణి సత్పుత్రునే
సర్వాంగంబుఁ గఠోరశస్త్రికలచే సృగ్ంచినానో ? ననుం
బర్వందద్వృజినావళుల్ కటకటా ! నంధ్యాత్వమూలంబునన్

చ. కలుగునొకల్గదో సుతుఁడు గన్నులకానుతగాఁగ; పాలడాల్
గులికెడు లేఁతబుగ్గలను గూరిమిముద్దిడు భాగ్యమబ్బదో ?
యిలసుతహీనయైన సతికేమిసుఖంబగు ? భోగభాగ్యముల్
బలిసియువ్యర్థమౌగద ! కృపాకరహీనని శావిధంబుగన్.

వ. అని యిటులఁ దలపోయుచు దుఃఖాక్రాంత మానస
యై.

చ. లలితపుఁబద్మపత్ర ముకుళంబులనుండి స్రవించు తేనెకా
ల్వలవలె బాష్పపూరములు పద్మదళాక్షి దృగంచలంబులం

వొలకిపయోధరాగ్రములతో నెకసక్కెములాడుభంగి, న
ప్పొలఁతుక వెక్కివెక్కి నిజపూర్వకృతాఘనిదాఘతప్తయై.

వ. అంతఁ బాలంబెల్లఁ గలియంగ్రుమ్మరియిస్సురనుచు
నావాలికుండు.

క. పటుసూర్యాతపసంహతి
నిటలంబున ఘర్మ బిందు నికరములొలయం
దటుకునఁ జనియింటికిఁ బ్ర
స్ఫుట దుఃఖవివర్ణ వదన సుదతినిగాంచెఁ ;

క. కాంచి విషాదము పెనఁగొనఁ
జంచన్నవ పల్లవాంగి చక్కికరిగి, యో
పంచాననమధ్యా! యీ
సంచున శోకింపనేల, సదయతఁ జెపుమా ;

ఆ-వె. ఇరుగుపొరుగు గఱితలెవ్వరైన నీతోడఁ
దగవు పెట్టికొనిరొ? తల్లిదండ్రు
లేమితిట్టినారొ? లేమరో! సెప్పుమ
హృదయమందుఁ గుందుటు దుటుడీర ;

చ. విరిసిన తమ్మిఁదేటిజత వేడ్కమరందములాని యెక్కుడై [ల్
నరసము గ్రక్కెనోయనఁగ నాతిరో! కన్నులబాష్పపూరము
పొరలఁగనేల? కేలనుగ పోలమునూనగనేల? బేలవో?
చిరుతవు? చెప్పరాదో? యని చింతదొలంకగ భర్తయుత్తఱిన్.

చ. అన ; విని కాంచనాంగియు దృగంచలకాంతివిషాదతప్తమై
గనియలు గట్టెనోయనఁగఁ, గజ్జలసమ్మిళితాశ్రుబిందువుల్

గునియుచుఁ గన్నులందొరఁగ, గోటనుమీటుచు, దంతదీధితు
కనధరోష్ఠరాగమును గప్పవచించెవిపంచికాధ్వనిన్. [ల్

పిట్టలకైన సంతసముపేర్చును బిల్లలఁగూడియుంట ; నా
కట్టిడి బ్రహ్మ యేలొకో సుఖంబులు సంపదలిచ్చి యొక్కనిం
బట్టిని గల్గ జేయఁడు ; ప్రపంచమునందిఁక నిట్టిజీవితం
బెట్టులఁ బుచ్చనేను ; హృదయేశ్వర ! యీశ్వరమాయ
యెట్టిదో !

అనవినిభర్తయిట్టులను నంబుజనేత్రరో! యీశ్వరున్ వృథా
పనప్రుచు దూఱనేల? మనపాపము కొండలమీఱ ; నూరకే
వనరిన నేమిసేయఁగల వారము పారము ముట్టకుండునే
మనదగుకోర్కె? వృద్ధులమొ? మానుము శోకము మానినీమణీ!

క. అనియిట్లు భార్యనుహాలికుఁడు
చనువునఁ దాఁగు స్తరించి సంతోషమునన్
మునుపటివలె సంసారం
బొనరుచుచుండగఁ దైవయోగముచేతన్.

క. నెలమసలె ; చీరచిక్కెను ;
బలుసులపై నిచ్చగలిగెఁ ; బొసఁగగతులయం
దలసత ; నెలఁతకుఁ జెక్కుల
నలిజిగిదలకొనియె ; నళులు బెరసెనుజగున్నై.

క. చనుమొనలు నల్లవాఱెను ;
మినమినవిడి పెదవుఁగొలసె వృత్తికఁ బావిం ;
దనరెను జిట్టుము లరుచియుఁ
దనుప్రస్రశమహెచ్చెఁగ'ను తరుణికిబలిసెన్.

వ. ఇటుల నాబోటిదుర్భర గర్భలాలసమైయుండ నొక్క నాఁడు.

తే.గీ. కాలశాస్త్రీయుఁ డంధికాకాళికధిక
భక్తిఁ, గడసంజతగరును బలిగనీయఁ
క్రొత్తనెత్తుటిధారలు గురిసెననఁగఁ
జేవురించెనుదిక్కులు చెలువుమీఱి.

సీ. పండియుట్టులువంచు పైరుజొంపములకు
జాళువాపూతలుగీలుకొల్పి
కన్నెపయ్యెరకల్లఁ గదలుచుగునిసాడు
జలదబాలలకెట్టు కలపమలఁది
కుజకోటరంబులఁ గూర్కెడు పెనుగుడ్ల
గూబలమాంద్యంబుఁ గొల్లగొట్టి
మొండరాపిల్లకునోయు క్రొన్ననలకుఁ
బూర్వరాగంబుకు బొదలఁజేసి

తే.గీ. ఆలమందలఁగదిలించి ; హాళికులకుఁ
బనులుచాలింపఁగనుసన్నఁబరగఁదెలిపి ;
భర్తలనుగూడ నుత్కంఠభామినులకుఁ
గొలిపి, రజనిముఖంబునఁగొఱలెనినుఁడు.

తే.గీ. సాంధ్యరాగంబు వృక్షాగ్రశాఖలందు
నలమి కొనినంత వహ్నికీలలుగ నెంచి
పక్షులెల్లను గూయుచుఁ బఱచుచుండెఁ
గాలిపోయెను గూళ్లంచుఁగడురయమున.

ఆ_వె. తారలుల్లసిల్లె; జారుల మనములు
కలువలట్లు కాంతి గడలుకొనియె;
జక్రవాకకాంత స్వాంతంబుపోలికఁ
దమ్మిమోముమోడ్చె నుమ్మలించి.

తే_గీ. అభ్ర కేదారమునఁ జంద్రుఁడనెడు గోప
బాలకుండుడు గణమను పసినిమేపు
చుండుపోయగ మత్తతినెమెప్పె; నటులఁ
గాక, చిహ్నమఁ గొంగడి గలుగుటెట్లు ?

తే_గీ. హంసబాలికలంబు విహారలీల
నంబరాపగ తరగల నాటలాడఁ,
గంపితంబయి యంభోజ కాండరజము
లలమికొనెనన, వెన్నెల లలరెమింట.

తే_గీ. అంతనాకాంత భర్తకు నన్నమునిడి
చంద్రికామోహానంబైన శర్వరినటు
పవ్వళింపగ మంచము బయటవైచె
నడుగువెట్టుట యామడ యట్లుగాఁగ ;

చ. పతియుభుజించివచ్చి సతి! పందులుదున్నలుగోవ యా వులుఁ
సతతము జొన్న చేఁలఁబడి సర్వము నాశముచేసెనంట ; యా
వితమును నేఁటిరాత్రిఁగని వేకువవత్తునటన్న భర్త, యా
సతి యిటుపల్కె నాథ ! మదిసంధిలె గోర్కెయొకండు
తెల్పెదన్.

తే_గీ. ఊంచబియ్యముమీఁద నాకూహ వొడమెఁ,
దిరిగివచ్చెడు నప్పుడు తెమ్మజొన్న

కుంకు లోకపదియని చెప్పఁగలికి, హాలికుఁ
“డట్లనే” యని తలయూఁచి యరిగెనపుడు.

చ. పొలఁతి యొకింతసేపుకనుమోడిచి, స్వప్నము రాఁగ లేచియీ
కలఫల మేమొ? మట్టియలు ఘల్లనివీడెను, గ్రొత్తచీరనా
తలపయిఁ గప్పినట్లుపడె, దారుణవహ్ని శిఖాముఖంబునం
బలువురుదండసంభృతులు బల్మిననుంబడఁ ద్రోచిరుగ్రులై.

ఉ. సారసగంధియిప్పగిది స్వప్నవిధంబును జింతచేసియో
సారససంభవాది సురసత్తమవందిత పాదపద్మ! దు
ష్పారకృపాపరా! పతికి బాధయొకింతయు నెప్పుడేనియుఁ
గూరక యుండుగాతమని కూర్మిదలంచెరమామనోహరున్.

ఉ. మాటికి స్వప్నసంగతులు మానసవీథిఁగలంచఁ గాఁపు సీ
మాటి భయార్తచిత్తయయి మంచము గేహముఁజెందునైచి,దీ
గూటను దీపమున్నిలిపి కూర్కొనొకించుక, యంతశార్వ్యమై
వాటిలెఁగిల్కిలారవము పక్షికులాయములందుఁ బెల్లుగన్.

సీ. కొక్కొరోయని కూసెఁ గుక్కుట నికరంబు
తెక్కలు దట్టించి నిక్కినిక్కి
చెరువునీటికిఁబోవు చేడెలయందెల
ఘల్లుఘల్లురావము గడలుకొనియెఁ
బైరుచేఁలకు నేగు సైరిక ప్రకరంబు
లొండొరుఁ బిల్చుపెన్నులివు లొప్పె ;
గోష్ఠమందలలోన గొల్లలపిల్లన
గ్రోవిసంగీతంబు కొమరుమీఱె;

తే.గీ. లేగదూడలు పల్పులు లాగికొనుచు
నట్టు లెత్తుచుఁదోకలు జిట్టకొట్టి
యంభ రావంబుసల్పుచు నాలమందఁ
బాలకఱచుచునుండె నిబ్బరముగాఁగ ;

తే.గీ. కాముకేళుల నిశియెల్లఁ గడిపియొడలు
మఱచి నిదురించు యువతుల మూదలింపఁ
జూరుసందులనుండి బంగారుసూదు
లవలె వ్యాపించె నరుణాంశులవములిండ్ల ;

తే.గీ. ప్రకృతిచైతన్య భావమువాపినట్టి
సంతమసమును హరియింప సమయవైద్యుఁ
డలరుపారద సిందూర గుళికవైచె
ననఁగనుదయించె రవిబింబ మరుణదీప్తి ;

వ. పడకలనుండిలేచి చలివాయుగఁ జీరలుగప్పి, చేతులం దిడికొని పేడచేటలను, "హే" యని బఱ్ఱెనదల్చి నాదియా కడియనియెత్తఁబర్వెడుచుఁ గాఁపులపిల్లలు బఱ్ఱెతండముల్ వెడఁజను వీథులంబునటుపచ్చుచుఁ బోవుచునుండిర త్తఱిన్ ;

తే.గీ. దుర్భరంబగు గర్భంబుతోననపుడు
కదలఁజాలక కదలుచుఁ గాఁపువెలఁది,
ప్రాచిపనులెల్లఁ దీరిచి బఱ్ఱెదూడ
వదలిపాల్పిండెఁ గంకణక్వణన మొలయ ;

వ. అంత వెడవెడ నొప్పులుగానిపించుటయు, గర్భవేదన కాదలంచి, నలజారమ్మ తన తల్లినింబిలువనంప, నాకెయు

మంత్రసానింబిలిచికొని కూఁతుంజూడవచ్చె. ఇట్లుండ మాదిగ యొకండు, తన జొన్న చేనిలోఁ గంకులు విఱిచియుండుటఁగన్గొని, చేని ప్రక్కనయాల మేపుమాల పిల్లలవిచారించి, వెంకటరెడ్డి గోసెనని తెలిసికొని, యిజారుదారుఁడును నలజారమ్మ తండ్రి యునగు పెంచలరెడ్డిఁజేరి యిట్లని విన్నవించుకొనియె.

తే-గీ. ఎన్నఁడెఱుఁగని మీయల్లుఁడే మొకాని
నిన్న ప్రొద్దునవచ్చి మా జొన్నమడికిఁ,
బెద్దకంకులు బుట్టెడు విఱిచెనంట!
కంచెయే చేనుమేసినఁ గలదెదిక్కు?

క. పిల్లలు పెండ్లము నేనును
నిల్లనకయు వాకిలనక యేగిమడులలోఁ
బెల్లుగఁ గష్టముచేసియుఁ
జెల్లించగలేము శిస్తు జేజే! సామీ!

క. మీరే తల్లులుదండ్రులు
మీరే బందుగులుమాకు, మీసలవనమా
వారలు పిల్లాపిసుగులు
గారాబముఁగోడఁ బ్రతుకఁగలిగితి మయ్యా!

తే-గీ. మీరు పెంచినమొలకను మీరెగోట
ద్రక్కలించిన మాకేది దిక్కు తండ్రి!
కడుపులోపలి యంబలి గదలకుండఁ
జాకుచుండిరి మీతాత సాలినుండి;

క. పెంచలరెడ్డిమ! దణ్ణము,
కొంచెము మనసుంచి మాదుగోడుదుపుమి ; మీ

పంచలనుందుముగద ; ర
క్షించినఁ గష్టంబులిడినఁ గిరితిమీాదే ;

వ. అంత నిజారుదారుఁడు కరుణామయహృదయుఁడై ;

ఉ. ఇవ్విధిజాలి పుట్టవచియించిన మాదిగవానిఁ జూచియీా
సవ్వడి యల్లునింబిలిచి చక్కవిచారణచేసి, యింకనీ
కెవ్విధమైన కష్టము రహింపకయుండెదు నట్లొనర్తు, నీ
విప్వగమానిపొమ్మ, మడికేగుమయన్న వినమ్రశీర్షుఁడై ;

ఉ. దండముదేవరా! సలవదాతలుకాఁపులు ; బుద్ధి; బుద్ధి; మీా
యండలఁగాకమాకసుపుటంగద దీరునె? గోవయాలరా
కుండగఁ జేయుమయ్య;యవియుక్కనఁగంకులుమేసిపోవు;నా
దండుగనోర్వలేము ; దయదప్పక నుమ్ములఁ జూడురెడ్డిమా !

తే-గీ. ఇటులశ్వపచుండు వచియించి యేఁగినంత
శోకసంతప్తచిత్తుఁడై సుక్కిరెడ్డి
గోడమోపునఁ గూర్చుండి కొంతసేపు
మనమునందిటులతలపోసె మాన్యుఁడగుట ;

తే-గీ. మాలమాదిగవారల మందమతులఁ
గష్టపెట్టిన మనకేమి గలుగుసుఖము?
సర్వజనులను బాలించు జగదధీశుఁ
డరయుచుండడె సకలాంతరాత్మయగుచు.

తే-గీ. ఇప్పుడైనను, రేపైన నెప్పుడైన
ననుభవింపక తీరునే యఖిలకర్మ

ఫలము; లటుగాన జనులకు భద్రమగును
న్యాయమార్గంబు దప్పక నడచుకొనుట.

క. సుతుఁడైన, మాతయైనను
సతియైనను నల్లుఁడైన సత్యంబునకున్
వ్యతిరేకత వర్తించిన
మతిమంతులు వారిపొత్తు మానుదురుధరన్.

ఉ. పెంచెలరెడ్డి యల్లుఁడఁట! పెంపతిమాదిగ జొన్న చేనిలోఁ
గొంచెపు బుద్ధిఁగంకులను గోసినవాఁడఁట! యంచునూరివా
రెంచరె? సుర్వశంబునిపు డెవ్విధి వ్రాకడవెట్టనౌను; నే
మంచితనంబుఁబూననిఁక మానముదక్కునె? కీర్తినిల్చునే?

ఉ. అల్లుఁడటంచు నాతఁడుదయామతి మన్ననచేసెఁ, గాకతాఁ
బెల్లుగశిక్షసేయఁడె? విభేదములెంతురె యోగ్యులంచున
న్నెల్లరుఁ దూలనాడరె? యహీనయశంబెటు వీడనౌను, నా
కెల్లవిధంబులందలఁప నింపగునాతని శిక్షసేయగన్.

క. నలజారమ్మను గర్భిణిఁ
దలపోసిన నామనంబు తద్దయునీరొ;
తెలుపక పతికృత్యమునే
మెలకువఁ బ్రశ్నింతు మున్నుమించుంబోరిన్;

చ. అనియిటు లేవఁబోవు సమయంబున నంబుజనేత్రయోర్తువ
చ్చి,నయమమిాఱఁ జెప్పెనొకచిన్నినిసుంగు జనించెనిప్డుకూఁ
తునకునటంచు; నంతనెదఁదోరము సంతసముప్పతిల్లవే
చనిపురిటింటిలోఁగనియె సారసనేత్రను, జిన్నిపాపనున్;

మ. నలజారమ్మయుఁ దండ్రిఁ గాంచి మదినానందంబు దైవాఱ వె
ల్వెల గ్రొన్నిగ్గులుకన్నుఁదమ్ములొలయన్వీక్షించి యోతండ్రి!
యాజలజాతాక్షు కృపావిశేషమున మత్సర్వాఘముల్బ్రూలి, న
వ్యలతాతన్వియొకర్తు గల్గెఁ గనుమా వాత్సల్యమేపారఁగన్;

చ. అనియిటులూరకున్న సుత, నల్లనఁగాంచివచించుఁదండ్రి, యో
తనయరో! బంధువర్గముముదంబును బొందగఁగందునోర్తునా
వనజభవుండొసంగె; మునుభక్తినొనర్చిన నోములియ్యెడం
దనయగ రూపముంబడసి ధాత్రిజనించెనుగాక యన్యమే?

ఉ. నామదినొక్క సందియమునాకెను; బాటిగదానిబుచ్చుస
త్యాముల నీతివాక్యములనమ్మ! వచింపుమ యుత్తరంబుగన్;
ధీమహితుండ యేని యొకతీరునఁ జిత్తముతత్తఱింపఁదా
నేమియుఁ జేయఁజాలఁడు,మఱెవ్వరు యోజనసెప్పనంతకున్.

ఉ. చౌర్యమునీచకృత్యమని, శాస్త్రవిరుద్ధమటంచెఱింగియున్
దుర్యశమొప్పసల్పునతి దుష్టునకెమ్మెయి శిక్షసేయగా
నార్యులకున్ముదంబగును న్యాయముసెప్పు; మిజారుదారుదు
ష్కార్యనియుక్తచిత్తులను గాఱియపెట్టక పీడవచ్చునే?

చ. అనిజనకుండువల్క, వినయంబునఁ బుత్రివచించునాయనా!
మనము తురుష్కభూపతుల మాటలతిక్రమణంబుసేయగాఁ
జనదు; తదీయధర్మములె శాస్త్రములట్లుదలంచి శిక్షలం
బొనరుపశ్రేయమౌను; దలపోయుమ వేఱువిధంబుగల్గినన్;

చ. యవనులన్యాయముందలప నారటగూరును జిత్తమంపఁ బ్రే
మవిలసనంబుశూన్య; మొకమానిసి చౌర్యముసల్పఁగొర్తయే.

దవిలినశిక్షయంచుఁ బ్రథితంబుగఁజాటును; పూర్వభూభుజుల్
సవురుగనిట్టిశాసనము లన్రచియించిరె క్రూరచిత్తులై,

క. అనియీరీతిగఁబల్కెడు
తనయనుదిలకించి తండ్రిధర్మంబునకుం
దనవారలూరివారని
చనునేభేదంబు? నోడునుసత్యంబనఁగన్;

చ. సరసిజబాంధవుండు కరజాలములోకమునందు భేదముం
బారయకసర్వవస్తువులఁ బూర్ణముగాఁ బ్రసరింపఁజేయున
ప్పురుసునన్యాయదాత తమవార్పరవారను భేదబుద్ధియెం
దరయకధర్మరక్షణ నయంబుగఁజేయఁ దొలంగునిందయున్;

మ. మునురక్షోహృతమైన సీతను సతీమోహంబునన్ రామచం
ద్రనరేంద్రుండు గ్రహించెనంచు బలునిందల్వల్కపౌరుల్ధరా
జనుగాంతారనివాసినిన్ సలుపఁడే శంకింపకారాముఁడున్;
మనవారల్పరవారలంచు సుజనుల్ న్యాయంబువోఁజూతురే.

మ. మునుగౌరవ్యులు ద్రౌపదింగినుకమైభూపాలసంఘంబు మూ
గిన పేరోలగమందుఁ జీరలొలువంగిడ్పాటు వీక్షించుచున్
ఘనులౌపాండవులుండగే వెడగులై న్యాయైక బద్ధాత్ములై,
జనకా! గూడవు పక్షపాతవిధముల్ సత్యంబుఁబాలించుచో;

చ. అని తనుజాతవల్కవిని యారటదోరముగూరఁ గన్నులం
జినుగక బాష్పతోయములు చెప్పెడిదేమియు లేకదీనతన్
జనకుఁడు వెచ్చనూర్చుచు వనారిలుచుండగఁ జూచికూఁతు రీ
వనటకు హేతువేమియని వందురుతండ్రిని బ్రశ్నచేయగన్.

ఉ. అక్కట! యిట్టివార్త నెటులాడుదు? నాడకపోవరాదు; నే
నక్కటికంబుమాని యెటులాత్మజ భర్తను జంపనేర్తు; నం
చొక్కెడఁగూఁతుఁజూచు; మఱియొక్కెడ మోమునువాంచు
లేచుఁగ్రై పెక్కినవానిపోల్కి నటులేగును వచ్చును! నేడ్చుఁ
బెల్లుగన్.

మ. తనయా! యంచను; నేమియున్న వినుమా ధర్మంబనున్, ఏమినా
నిను నెవ్వారలుపిల్చిరంచుఁగినియున్ నీవేగ దాయన్న యేమను
దండ్రీ యిది యేమి వెఱ్ఱియనఁగా హాయంచు నస్వ్యంగదున్;
ఘనశోకావిలచిత్తుఁడై శిరముపీకందాకుఁ బెన్భిత్తికిన్;

ఉ. మాటికి జొన్నకంకులన, మాదిగవాఁడనఁ, గొర్తవేత ము
మ్మాటికిఁ దప్పుసేయన, క్షమాపణలేదన, నౌను గాదనం,
బాటిలె దుఃఖమెట్లు విడఁబాటగునంచనఁదండ్రి, భీతి స
ప్పాటలగంధి డెందముగ భ్రాలనగంట కితాంగవల్లియై;

వ. చేతఁబొత్తుల నిదురించుచున్న చిన్న పాపమంచ
బున జాఱుటనైనఁ దెలిసికొనక, తండ్రినింబరికించి నాయనా
మాదిగవాఁడెనందు? జొన్నకంకు లెక్కడివి? కొర్తవేత
యేమి? యని ప్రశ్నించుచుండునంత, వెంకటరెడ్డియు జొన్న
కంకులు దుప్పటియందుగట్టి భుజముపై వైచికొని యిలుసేరి,
భార్య ప్రసవించుటవిని సంతోషించుచుఁ బురిటింటిలోనికివచ్చె.

ఉ. వచ్చిన భర్తమూపుపయిఁ బట్టుగమూఁటెపు కంకులుంట నీ
తెచ్చిన కంకులెచ్చటివి? తెచ్చితివో మనచేనినుండి, తే
కెచ్చటనుండి తెచ్చితివి? యేమనఁదొయ్యలి, వెల్లబోయి రా
పచ్చు పడంగజిత్తమున నచ్చటఁ గంకులువైచి భర్తయున్;

ఆ-వె. జొన్న పాదు సేయు దున్న లఁ బందులఁ
దోలితోలి కొంతసోలి, రాత్రి
నిదురవోయి లేచి నిదురమత్తున మాది
గ, చినవానిచేని కంచె దాటి.

క. నేనటు కంకులు గోయఁగ
మానసమునఁ దట్టినదియు మాదిగ చేనం
చోన లినాక్షిరో! యంతట
మానితిఁ గంకులనువిఱువ; మడిపీడి వెసన్

క. వచ్చితి; నని చెప్పుచునేఁ
దెచ్చిన కంకులను జూడు తెల్లగముత్యా
లచ్చొత్తినట్లు సొంపగు;
గిచ్చినఁ బాల్గారుననుచుఁ గెలననిలువఁగన్;

వ. అంతఁ బెంచలరెడ్డి యిట్లనియె.

ఆ-వె. గొప్పవారికైనఁ జొప్పడుఁ బొరపాటు
ఇదియె తప్పుగాఁగ నెంచఁదగదు;
బుద్ధిదెలిసి యెవఁడు పొనరుచుఁ జౌర్యంబు
నట్టివాఁడ శిక్షకర్హుఁడిలను;

చ. అనిజనకుండువల్క సుతన్యాయపురీతి వచించుఁదండ్రి! నీ
వనునుడికార మెంతయునయం బె? యశం బె? వెలుంగునిప్పు
కల్, గనకయత్రొక్కినంబదము గాలక యుండునె? ధర్మమా
ర్గమున్ మనమె త్రొలంగినంబరులు మాన్యతఁజూతురె?
నిందదప్పునే?

వ. ఇటులఁ బల్కుచు నలజారమ్మ, భర్తను విలోకించి.

చ. వినుహృదయేశ! నాపలుకు, పీగులవంశమునందుఁబుట్టి యీ
దినముననిట్టి దుర్యశము దెచ్చిన యల్లునిశిక్ష సేయకే
తనయనుజూచి యేమొనిజ ధర్మము పెంచలరెడ్డి దప్పెనం
చను నపకీర్తిగాని విధియారసి యట్లుచరింపఁ బెంపగున్ ;

చ. సతముశరీరముంచుఁ బెలుచందలపోయుటకాని, వృంత సం
చ్యుతకుసుమంబురీతి, నెటనోయొకచోటను, నేఁడొ రేపొ, యె
వ్వితమునసైన నేలఁబడు ; విశ్వమునందు యశంబెనిత్యమై
పతి ! విలసిల్లు దిక్ముఖవిభాసితమై సుజనప్రపూజ్యమై ;

క. నలజారమ్మయునిట్లని
తళుకుల కడగంటి చూపు తనపతిఁ గప్పం
దిలకింప, భర్తయిట్లనెఁ
బొలఁతీ ! నిన్నెటుల వీడిపోఁగల నింతిన్ ;

క. శారికమిథునంబటువలెఁ
గూరిమి నివసింపఁజేసి క్రూరతనిపుడా
వారిజ సంభవుఁడేలొకో
దారుణ విరహంబుగూర్చెఁ దలఁచెనుగట్టా !

క. అని దీనత గద్గదరుతి
మొనయగ వచియించుభర్త మొగముంగని, యే
మనిమెదునాథా ! నీసతి
నిను వీడునె స్వర్గమందు నిరయంబుననేన్ ;

క. అనవిని, నీలపుగాజులు
గుని సెడు ముంజేతిముద్దుగొని పతియేగ౯
మనమున శ్రీహరిఁదలచుచు
ననువుగ బాలెంతస్నానమాడి పసపున౯.

సీ. జాళువా బంగారు డాలుడీలఁగఁజాలు
హారిద్ర చేలంబు నంతఁగట్టి;
పసపునిగ్గులుదేలు ఫాలభాగంబున
సిందూర తిలకంబు పొందుపఱచి;
కన్నుఁగల్వలుకొంత వన్నెమీఱఁగఁగ్రొత్త
కాటుక రేఖలు నీటుపఱచి;
గుబగుబనెత్తావి గుల్కెడు జవ్వాది
కలపంబు బాహలఁ గలయనలఁది;

తే-గీ. జాజిపూవులు చేమంతి సరులుకీలు
గంటునకుఁ జుట్టివాల్గంటి కరుణమెఱయఁ,
బేర్చుడిప్పుడు గుండము భీతిలేక
యనఁగఁ, దండ్రియుఁగడు భక్తినట్లుచేసె;

వ. అల్లుఁడు దుర్మరణంబు సెందెనని దురపిల్లు పెంచల రెడ్డిభార్య, పుత్రిగూడగుండంబునంబడ నుద్యమించెనని తెలిసి.

సీ. కన్నీరుమున్నీరు గాఁగ నేడ్చుచువచ్చి
సుతనుగౌఁగిటఁ జేర్చి వెతలఁబడుచుఁ;
గూఁతురా! మమ్మిట్లు గుందించి నీవేల
గుండానదూకంగ గుణమెచెపుమ;

కూఁతురైననునీవె కొడుకైన నీవె, మా
కెవ్వరున్నారింక నిజ్జగమునఁ;
గాటికిఁగాల్సాచు కాలంబునఁ మమ్ము
దుఃఖానముంపంగఁ దొడఁగితేఁటవె;

ఆ-వె. నన్నుగన్నతల్లి! నామాటవినవమ్మ
కన్నకడుపునిట్లు కలఁచిపోవ
ధర్మమగునె యంచుఁ దల్లి యెలుగురాయఁ
బలికి, చెక్కునిమురఁ బడఁతి యనియె;

క. నాకొఱకుఁగాదె నాపతి
నీఁకను బ్రాణంబు విడిచి విశ్వమునందుం
బ్రాకట యశమును బొందెను;
నాకును నట్టి దియసూవె న్యాయముతల్లీ!

ఉ. నావుసుబంధుజాలమువనారిలె, 'సాధ్వీరో! మాదుగేహముల్
పావనమౌనుద్వల్లలిత పాదసరోజ పరాగసంపదఁ
బావని! రమ్మ' టంచునుసువాసిను లర్మిలివేఁడ, నామెప్రే
మావిలచిత్తయైకదిలె నందఱి బంధుగులిండ్లకుఁ వెసఁ.

క. బంధుగులఁజెలిమికత్తెల
నందఱఁ గౌఁగిటనుజేర్చి యాదరమునవా
రందందునిచ్చుకానిక
లందుచుఁజనుదెంచి చంచలాంగియుభక్తిఁ;

తే-గీ. తల్లిదండ్రులకుఁ మ్రొక్కియుల్లమందు
దేవదేవునిజింతించి దీప్తిఁజెలఁగి,

మందహాసము సెలవులఁ గ్రందుకొనఁగ
నగ్నిగర్భంబుసొచ్చె నయ్యతివమిన్న;

సీ. సాంధ్యరాగచ్ఛటా సంఛాదితాస్తాద్రి
కటకసంచర దభ్రఖండమనఁగ;
జలజరాగ పరాగకలితోర్మి మాలికా
డోలికాచంచన్మరాళమనఁగఁ,
బల్లవితాశోక పాదపాశ్రయనవ
ప్రసవభారానత వల్లియనఁగ;
గైరికసిందూర కలితపూర్వాచల
పీఠస్థపూర్ణేందు బింబమనఁగ;

తే-గీ. సతిరహించెను గుండానఁజటులవహ్ని
శిఖలునల్గడవ్యాపించి చిటపటార్గ
ళబ్దభీమంబులై ధూమచయముగ్రక్కఁ,
బ్రేక్షకావళిగుండెలు పెటిలిపోవ;

తే-గీ. పంచభూతాత్మకంబైన పడఁతిమేను
ప్రకృతిలీనమై పూతమైపరిఢవిల్లె;
మిగిలియుండెను సత్కీర్తిపగిది, సాధ్వి
యాత్మసర్వంబు తానయైయతిశయిల్లె;

మ. ధరదుప్వ్రారుసువంశసంజనితుఁడై, ధర్మాత్ముఁడై సత్కృపా
పరుఁడై, శ్రీహరిభక్తుఁడై తగినసుబ్బారెడ్డి పుత్త్రుండు, మ
త్పరమాప్తుల్ ననురామరెడ్డియనుచున్వాఁడొందు; రిక్షావ్య
న్నరసోక్తుల్ గులుకన్ రచించితిసతీసంఘోంప యుక్తంబుగన్;

సంపూర్ణం.

---

PRINTED AT THE INDIA PRINTING WORKS, MADRAS.